వ. అని యయ్యింతివలవంతసూచి నెచ్చెలులు పలుమాటలవలరాజునుద్దేశించి.

గీ. పద్మభవునిమీఁదఁ బంకజోదరుమీఁద, హరునిమీఁద వేసినట్టిశరము
నబలమీఁదఁ జాల నదయత నేయంగఁ, బంచబాణ నీకుఁ బాడి యగునె.

వ. అని పలికి యేమిట నమ్మగువనేన నుద్దీపించిన మదనతాపంబు వాయకున్న
ని ట్లనియె. ౨౬

చ. హరునిటలాగ్ని రూపఱియు నంగజుఁ డప్పుడ పుట్టె రాఘవే
శ్వరుఁడు శపించినం బికరవంబులు గ్రమ్మఱఁ గల్గె రాహువు ని
ష్ఠురగతిఁ బట్టి మ్రింగినను సోముఁడు వెల్వడివచ్చెఁ జెల్లఁబో
విరహులఁ బొందియున్నశని వీడియు వీడద యేమిసేయుదుర్. ౨౭

వ. అని పలికి యిందువదనకు మనసేయు చలిమందుల మదనతాపంబు దీపించె
నింక నివి వల దని శిశిరోపచారంబుల పని చాలించి చింతింపం దొడంగిన
నక్కమలమంజరిం జేరం జని. ౨౮

మ. తరుణీ నే నొకసిద్ధపుంగవుని నత్యంతంబు సేవించి యే
నరు లేరూపులు సూడ నర్థివడినం దద్భావము గ్రాంతసే
పరుదారం బొడసూపవచ్చు వరవిద్య న్వేఁడికొన్న న్మనో
హరభావస్ఫురదింద్రజాలవరవిద్య న్నాకు నిచ్చెన్ దయన్. ౨౯

క. ఈపొలఁతికిఁ గమలాకర, రూపము తద్విద్యచేర్చి రూపెసలారం
జూపుదును దాన మన్మథ, తాపంబు శమించుఁ దెలివి దలకొను ననినన్.

క. ఆచెలువుని చిత్రాకృతి, చూచినయట్లైన రూపుచూచిన మరుచే
నేచంద మగునొ మున్న న, గోచర మున్మాదవృత్తి గూరిన యేనిన్. ౩౧

క. అనునంతటఁ గమలాకరుఁ, డనుభూపతి వాహినీచయంబులతోఁ దెం
పెనయఁగ వేత్రవతీవా, హినిదరి విడిసె నని పౌరు లెల్లన్ బెదరన్. ౩౨

క. నీ వరగుదెంచి తని హం, సావళి దెలివొందుటయును నానందలస
ద్భావమున నంతిపురమున, నావెలఁదిని గొనుచు బోటు లరిగెదు నంతన్.

గీ. అడుగఁ బుత్తెంచుటయుఁ గమలాకరునకుఁ
బుత్త్రి నీ నిశ్చయము చేసె భూమిపాలుఁ
డనుచుఁ బరిచారికలు చెప్పికొనఁ గడంగ
నతికి విధికృతి నాత్మ సంశయము పుట్టె. ౩౪

క. ఆకీరము చెప్పినకమ, లాకరుఁడో యున్న కేంద్రుఁ డన్యుఁడో యని చిం
తాకులతఁ గమలమంజరి, నీకడకుం బనుప మరుఁడు నికృతి యొనర్చెన్.

క. కమలాక్షికిఁ బ్రాణముప్రాణము తత్సఖి కీవు సేయునా తలఁపఁగ నీ
కమనీయమూర్తివిభవము, కమలాననబాము మాన్పఁగలిగెఁ గుమారా.
క. నీవిడిసియున్నయది హంసావళి విహరించు తోఁట యనవరతంబున్
భూవల్లభ యిందాడుదు, మావనితయు మేముఁ జాల ననుమోదమునన్.
సీ. ఈచంపకముపొంత నీమావిక్రీనీడ మానినీరత్నంబు మరుని నోఁచె
నీమాధవీలత నీయశోకముతోడ నబ్జలోచన వివాహంబుచేసె
నీకేళికుళిలోన నెలనాఁగ ప్రోదిరాయంచలకవల నిందించి యాడె
నీపువ్వుఁబొదలలో నీరత్నవేదిపైఁ జెలువ బొమ్మలపెండ్లి చేసె మున్ను
భూపనందన యీసురపొన్నపొంత, ముత్తియంబులపందిరి ముదిత వెట్టెఁ
బ్రేమ నాడెడుచోటనీచామచూపె, మానవేంద్రనిహృదయంబు మరులుకొనఁగ.
సీ. ఈహంసయానంబు నింతయొప్పయి యున్నె యతివయిక్కడ గెడయాడెనేని
యీపుష్పములతావి యింత లెస్సయి యున్నె సుందరిమైతావి సుడిసెనేని
యీచిలుకలమాట లింత యింపయి యున్నె వెలఁదితిన్ననిపల్కు వింటిమేని
యీ తేఁటిగమిచాయయింతయొప్పయి యున్నెసుదతి వేనలిచూచిచూతుమేని
పూవుఁబోఁడి హంసావళి యీవనమున, వేడ్క విహరింపకుండుట వీని కెల్ల
నింపు సమకూరెఁగాక యియ్యింతి యున్న
మనకు నింపుఁ జేయునో యివి మానవేంద్ర. ౩౯
వ. అనిన మాటలు విని యనురాగంబు నివ్వటిల్ల. ౪౦
సీ. పొలఁతి కౌఁగిటఁ జేర్పఁ బూచి నెత్తావుల క్రోవి యైనదియొ యీక్రోవియొక్కొ
మానినీగండూషమధువుసోఁకునఁ బూచి పొగడనొప్పినదియీపొగడయొక్కొ
నళినాక్షిపదతాడనంబునఁ బూచి శుశ్లోకమైనదియొ యశోకమొక్కొ
యెలనాఁగ మెఱుఁగుఁజూపులఁ బూచి భూజాతతిలకమైనదియొయీతిలకమొక్కొ
యివ్వనములోన నిన్నియు నెఱుఁగకున్నఁ, దరుణికౌఁగిటఁ జేర్చినకురవకంబు
నాకుఁ జూపినఁ బరిరంభణంబు చేసి, నట్టులైనఁ గృతార్థుఁడ నగుదునబల.
క. అని యంత మదనతాపము, ఘనమగుటయు సైఁపలేక కాంతా నీనే
ర్చినయింద్రజాలవిద్యను, వనజాననరూపు చూపవలయు ననుటయున్. ౪౧
వ. తనవిద్యాప్రభావంబున రాజకన్యమోహనాకారంబు దృగ్గోచరంబుగావించిన.
క. వనజాస్యమోహనాకృతి, కనుఁగవ కతికౌతుకంబు గావించుటయున్
మనమున మాయారూపం, బని తెలియఁగ మఱచి చాల ననురక్తుం డై.

చ. తళతళఁ బర్వఁ గ్రొమ్మెఱుఁగుఁదండములం బురణించు మేని [illegible]...
దళవమునందుఁ(?) జూపులు మనంబునుఁ జిక్కినఁ గ్రమ్మఱింపలే
కలికులవేణి తెప్ప యిది కానరపాలుఁడు సూచుచుండె ని
శ్చలమతిఁ గాముతూపులకు జానుగ నిల్పిన దెప్పమో యనన్. ౮౫

సీ. నెత్తమ్మిరేకుల నెచ్చెలులై యొప్పు మృదుపదంబులమీఁద మొలఁగి మొలఁగి
నునుమించు మించునఁ గనకకుంభమ్ముల కెనయైన చనుఁగవ నెక్కి యెక్కి
కందని యిందుని యందంబు నొందిన చిఱునవ్వు నెమ్మోముఁ జెంది చెంది
మెఱచిన తొలుకారు మెఱుఁగులకవలైన చెలువుఁ జూపులమీఁదఁ బొలసి పొలసి
ముదితయనుపమాన మోహనాకారంబు, చాల మరగి యానృపాలుచూడ్కి
తీపుమిగులఁ బువ్వుఁదేనియ గ్రోలి మ, త్తిల్లి కడల నున్న తేఁటిఁబోలె. ౮౬

వ. ఇవ్విధంబున నంగజాధీనుండైన యమ్మానవేంద్రుండు. ౮౭

సీ. వనజాక్షి కెంగేలుఁ దనకేలుఁ గీలించి కేళికిఁ దివియంగ లీలఁ గడఁగు
నంగనామణి మోహనాంగవల్లికఁ జాల నాలింగనముసేయ నప్పళించుఁ
జెలువతీపారెడు చిగురాకుఁ గెమ్మోవి నాదట గముషంగ నాససేయు
నెలనాఁగ మెలపారు నిఱిచన్నుఁగవకాంతి సనుక్తిఁ గబళింప నగ్గలించు
నివ్విధమునఁ దమక మొంతయు మిగులంగ, నతివఁ జేరఁ గోరు నవసరమునఁ
దోయజాక్షి రూపు మాయమై పోయినఁ, జాల ఱిచ్చవడు నృపాలసుతుఁడు.

వ. అయింద్రజాలకలితమాయారూపంబని యెఱుంగనేరక మదనావేశంబుకతం
బున హంసావళియ కా నిశ్చయించి యారమణి నన్ను గారవింపంగాఁ ద
లంచి యవ్వనంబునం దాఁగె నని యూహించి పూఁబొదల నోలంబుల వెదకి
వెదకి యున్మాదంబుం బొందె. ౮౯

సీ. అదె నాకు నెలుఁగిచ్చె నంగన యని మొగి కలకంఠనుదిమైనఁ గళవళించు
నదె మాటలాడెఁ జంద్రానన యని చేరి శుకభాషణము లైన సొలపునొందు
నదె తలచూపె నీలాలక యని డాసి తుమ్మెదపొదమైనఁ దూలపోవు
నదె చీరెఁ జేసన్న నబ్జాక్షి యని చేరి యెలమావి చిగురైన నిచ్చఁ గలఁగుఁ
దడవి కానని చోటను దడవఁ బోవు, నేల పొడసూపి మాయమై తివ్విధమున
నలఁపఁదగునె హంసావళియనుచు దూఱు, భావజన్మునుగారి నృపభూవిభుండు.

వ. ఇవ్విధంబున మన్మథోన్మాదబాణవిదారితమానసుండగుచుఁ గొంతతడ వవ్వ
నాంతరంబున జరించినంత నత్యంతసంభ్రమంబున వసంతకుం డచ్చటికిం బఱ

తెంచి హంసావళీకన్య యున్నది యనుపలుకు మున్నుగా నన్నరనాథునితో
ని ట్లనియె. ౫౧

సీ. అధిప హంసావళి యాబూరుగున నుండ కొకపువ్వుఁబొదలోన నుండిరాత్రి
యనలంబుచేత నేయాపదఁబొందక బ్రదికియుండఁగఁ బ్రభాత వేళఁ
బూవ్రులకై పువ్వులావికలేగి యాకోమలిఁ గాంచి తోకొనుచుఁ బోయి
యంతఃపురంబున నడలెడుతల్లియు జనకుండు నున్నెడ కనుచుటయును
వార లెంతయువెఱఁగంది వచ్చిగ్రుచ్చి, యత్తి కౌఁగిటఁజేర్చి యందంద పేర్చి
క్రమ్ముకన్నీటితోడుత నుమ్మలించి, యమ్మ బ్రదికి యేగతి వచ్చితమ్మ యనుచుఁ
గీ. కన్ను నీరు దుడిచి కన్నియ నూరార్చి, పాపజాతి బోటిపాటుఁ జెప్పి
నేఁడు పెండ్లి యంచు నెమ్మి వుట్టగఁ బల్కి, వాఁడెమనకుఁ జెప్ప వచ్చెననిన.
వ. ఆనందకందళితమానస యమ్మొ నప్పు డమ్మేఖమాల నరేంద్రుండు విభవం
బున నక్కములానునం దోకొని చని. ౫౪

క. తొడవులుతనులత నునిచినఁ,గడునొప్పయి యుండి తొంటికంటెనురుచితోఁ
బడఁతుకయంగముతొడవులు,తొడవని మొ కుపలుకుపలుకుఁదొడవై మెఱయున్
వ. ఇవ్విధంబుననచ్చెలు లచ్చెలువకుశృంగారంబుచేసి రయ్యవసరంబునన క్కడ.
సీ. వాహననికురుంబవల్లరీజృంభితకాంచనకింకిణీక్వణనములును
మాణిక్యమండనమండితగాణిక్యమంజులమంజీరశింజితమును
వాంశికవైణికవందిబృందానేక వేణువీణాస్తుతక్వాణములును
లాసికమోహనలాస్యలీలోచితమర్దళమురజాదిమహితరవము
కర్ణచామరసౌవర్ణకర్ణలలిత, వర్ణకంబళభూషణవ్రాతకలిత
దంతిఘంటారవంబులుందనరుచుండఁ,గదలెఁబెండిలికొడుకు వేడ్కలుదలిర్ప.
ఉ. అంతఁ జిరంటికాజనము లల్లన వచ్చిరి రాజు ముందటం
గ్రంతకు నైనవస్తువులు కాంచనపాత్రలఁ గొంచు సంతతా
తాంతలతాంతకోరకవిలాసమనోహరపల్లవావళీ
కాంతఫలావలుల్ దనరఁ గామమనోహరవల్లికాకృతిన్. ౫౭

సీ. ధమ్మిల్లములఁ బుష్పదండలచెలువంబు సూనకప్రభలును సొబగు నొంద
నలికకస్తూరికాతిలకవిభ్రమములుఁ గుంతలరోచులుఁ గొమరుమిగుల
రంగార నలఁదిన యంగరాగంబులుఁ జీనాంబరంబులుం జెలువుమిగుల
భాసురమోహనాపాంగమరీచులుఁ గర్ణభూషణములుం గలసి బెరయ

నంగదీప్తులుఁదోడవులునఁగిపెనఁగి, విదితపార్వతీకల్యాణవిభవవినుత
గానములు కర్ణపర్వము ల్గాఁగనడచు, పేరటాండ్రయందంబులు బెడఁగుఁ జేసె.

వ. ఇవ్విధంబున విభవంబులు మెఱయఁ బురంబుఁ బ్రవేశించిన వైభవసురేంద్రుండైన మాళవేంద్రుండు మించిన వేడ్క నెదురు చనుదెంచి తోడ్కొని పోవం దదీయమందిరంబు ప్రవేశించిన యనంతరంబున స్వజనంబు లయ్యేలనాఁగ వివాహవేదికాతలంబున నునిచి గండవసం బెత్తించి యయ్యెడకు నక్షుమారుం దోడ్కొని యరిగిన. ౬౦

క. ఊఁడిరి కాంతయుఁ బతియును, గండవడము మాటునందుఁ గడునింపులతో
నిండిన వేడ్కలు దనరఁగ, నొండొరులం జూడఁ గన్ను లువ్విళ్లూరన్. ౬౧

వ. అంతం బురోహితమంగళాచారానంతరంబ మౌహూర్తికదత్తశుభముహూర్తంబునం దెరయెత్తించిన. ౬౨

సీ. లజ్జఁ గొండొకసేపు లలనదృగ్జాలముల్ తెప్పలలోనన యుప్పతిల్లు
విచ్చలవిడిఁ బర్వె విభునివీక్షణములు మెలఁతమోహనమూర్తిమీఁదఁ బర్వెఁ
దనరెడు వేడుకఁ దన్వంగిచూపులు చెలువునిమోముపైఁ బొలసి మగుడుఁ
జూపులు దార్కొన సుదతీలలామంబు లలితంపు సిగ్గునఁ గళవళించు
నపుడు దమచందములు చూచి యలరుప్రోడ
యలరుఁబోఁడులసరసోక్తు లమృతరసము
సోన లొలికించె నెంతయు సొబగుమిగిలి
తమకు నవ్వును చెవుల కుత్సవ మొనర్ప. ౬౩

సీ. పళ్లెరంబులనున్న ప్రాలు దోయిటముంచి పాణిపద్మంబులు భ్రమలు నిండ
సేసలు పెట్టంగఁ జేతు లెత్తె · చోటఁ గరమూలరోచులు గ్రమ్ముదేర
చేత(తె)గ్లుదెచ్చుచో సితకటాక్షంబుల మించి నీరెండల ముంచికొనఁగఁ
దలఁబ్రాలపందిడిఁ జెలువపయ్యెదవాసి యుఱిచన్నుఁగవకాంతి గిఱికొనంగఁ
దానుఁ జయ్యన ధవళాక్షతలు ధరించి
పౌలఁతిమౌళిపై నినుపారఁ బోయ మిగులఁ
బాటలాసితసితహారిప్రభలు దనరఁ
బాటవము లేక పతి తొట్రుపాటు నొందె. ౬౪

క. తలఁబ్రాలు వోయఁ దస్మర్ర,జలజంబులపొందు పతికి జలజాననకున్
దళముగ సకలాంగములను, బులకాంకురవితతి నాటుకోయుచునుండెన్.

వ. ఇవ్విధంబున మహోత్సవానందకందళిత మానసులైన యాదంపతులకు
హేమానంతరంబ మాళవేశ్వరుం డనేకకరితురగ రత్నభూషణ చీనాంబ
రాది మనోహరధనం బరణం బిచ్చి వందిమాగధాదిజనంబుల కభీష్టధనంబు
లొసంగి యందఱ నన్నపానాదులం బరితృప్తులం జేసి దంపతుల నర్హమందిరం
బుల నునిచె నయ్యవసరంబున. ౬౯

సీ. అబ్ధిశు సాంధ్యసేవాభిషేకమునకు జలధి ముంచిన హేమకలశ మనఁగ
జలధియుద్యానభూజంబున రాలిన బంధురపరిపక్వఫల మనంగ
నంబుదదంతి గోరాడ నంబుధిఁ బడ్డ యపరాద్రిధాతురాగార్ద్ర మనఁగ
వరుణకుటుంబినీకరతలంబునఁ దప్పి పడినమాణిక్యపుబంతి యనఁగ
వారుణీసక్తుఁడై జాఱి వనజబంధుఁ, డపరగిరిమీఁదఁ గాల్జాఱ నబ్ధిఁబడియె
వారుణీసక్తులై పెఱవార లెల్లు, చక్క నిలువంగ నేర్తురు నిక్క మరయ.

క. దినలక్ష్మి యినుఁడు చనుటయు, ననుగమనముసేయఁ బశ్చిమాచలమున నొ
ట్టినయొఱమంటలపోలికె, ఘనసంధ్యారాగరుచులు గడు నొప్పారెన్.

గీ. మించెనెఱసంజ లడరి యామీఁదఁదార, లల్లనల్లనఁ దోతెంచెఁ బెల్లుగాఁగ
నూతనంబుగ నంబరానోకహంబు, చిగురు నిండారఁ బెట్టి పూచెనో యనంగ.

గీ. జలరుహములుసూర్యబలమేమియును లేమిఁ, జంద్రుఁడొప్పకునికిఁ జాలఁగుందె
గ్రహబలంబు లేనికాలంబు నెంతటి, సిరులుగలుగువారుఁ జిక్కువడరె. ౭౦

సీ. మధుపసంఘంబులుమట్టిమల్లాడుచుఁ గువలయంబులుచూఱఁగొనఁదొడంగె
ద్విజకోటి సన్మార్గవిహారణంబులు దక్కి యడఁగి కుజాతుల నాశ్రయించెఁ
బతులచేరువ లేనిభామల డగ్గఱి మారుండు భీతి నిండారఁ జేసెఁ
గులశీలవిధములఁ దలఁపంగనేరక జారచోరావలి సంచరించె
మహి వివేకులు ఘనతమోమార్గులైరి, యేకవర్ణత వాటిల్లె లోకమునకు
నధికతేజస్వియగునినుఁ డస్తమింప, దివి యరాజకమై యున్న యవసరమున.

ఉ. తాంతము లైనతామరలతావులు సేవలు దక్కిపోవఁగా
నంతట వచ్చి చొచ్చె మధుపావళి గ్రోలుచు సోలుచుండఁగాఁ
గాంతవనాంతరాంతరవికామనివాసవిజృంభమాణసా
యంతనమల్లికాకుసుమహోమనోహరసారభావలుల్. ౭౧

సీ. ఇది చనుదెంచె నే నేగరా దనిరొక్కొ తోయజబంధుండు తొలఁగిపోవు
నిది తెరు రూపఱఁ బోదలెను ననిరొక్కొ రాజు రయంబున రాక తడసె

నిది వెనుదగిలిన నేగరా దనియొక్కొ చుక్కలు దీనిలోఁ జొచ్చి వెలసె
నిది క్రింగు ననియొక్కొ యిప్పుడుదీపరూపమున నిండులుసొచ్చెఁబవనబంధుఁ
డనఁగ దెస లెల్లఁ గస్తూరి నలఁదినట్లు, మింట నెల్లను గాటుక మెత్తినట్లు
నుర్వి గలయంతయును నీలి నూంచినట్లు,నంతకంతకు నగ్గలమయ్యెఁ దమము.

వ. అయ్యవసరంబున. ౭౪

సీ. సిరితోడఁ బుట్టువు చెంగల్వచెలిపొందు ప్రసంగడము తన్నునకు నెలవు
చీకటి మూఁకలఁ జెండాడి నెఱరాతు మున్నీటి నుబ్బించుముద్దుఁబట్టి
యుమపాలికన్ను పున్నమతేఁడు వెన్నుని పయ్యెంబు తామరవిరులగొంగ
ముక్కంటితలపూవు చుక్కలయేలిక వెన్నెలకందువు వేల్పుబువ్వ
కూడి పాసినవారలగుండెదిగులు, పాసి కలసినవారలపాలియింపు
ప్రేమపుఁగొంపున నెంతయు బెడఁగునొంది
మన్మథునిమామ యగుచందమామ వొడిచె. ౭౫

గీ. పూర్వగిరి పానవట్ట మైపొలుపుమిగులఁ,బన్నరాగలింగమువోలెఁ బ్రబలెరాజు
పూజ చేసిన నవకంపుఁ బూవులట్లు, లుపరితలమునఁ దారక లొప్పు మిగిలె.

చ. సలలితలీలఁ బ్రాగ్వనితఁ జాలఁగ రాగముఁబొందఁ జేసి యిం
పొలయఁ గుముద్వతీసతికి నుల్లసనం బొదవంగఁ జేయుచు
న్విలసితతారకాంగనల వెన్నెలగందపుఁబూఁతచేతఁ బె
ల్లలరఁగఁ జేసె నప్పు డమృతాంశుఁడు దక్షిణనాయకాకృతిన్. ౭౭

... ... (గ్రంథపాతము) ... ...

...సంతోషంబు నిగుడుచుండ వైభవముతోడ శృంగారవనము సొచ్చి

సీ. మంజీరమంజుల శింజితంబు సెలంగ
లవిందులుచేసి పూవ్రుఁదీఁగెలపొంతఁ బొలసిపొలసి
నెరుపారనిండు వెన్నెలచల్లు చూపుల సొంపార మామిళ్ళ చూచిచూచి
విరులు వేడుకఁ గోయఁ గరము
...టలోఁగరము స్నేహ్డఁ, దిరుగుచున్నట్టినిర్ఝరతరుణు లనఁగ
నవవికాసంబు గతులకు నవక మొసఁగ,వనములోపలఁదిరిగిరివనజముఖులు.

సీ. పొగడంగ దుమువారు
నోపాటలాధర యీపాటలము నీవు ముట్టకు మనియొట్టు పెట్టువారు

రాజాన యనుచు నీరాజాననఁ దొలంగ దటుచూడు దీని
లేవె చెలు లిందు రండని చీరువారు
మెరయుపువ్వులుగనుఁగొని మెచ్చువారుఁ, జిలుకబోదలఁ బట్టంగఁ జేరువారు
నగుచు నెంతయు వేడ్కల నతిశయిల్ల ... ౭౯

సీ. నొకకొంత మోపి నిక్కుటయును మంజీరములు తొలిమాటసలుప
వామకరంబులఁ వరశాఖ లూఁదిన మణిముద్రికలదీప్తి మాఱుమలయఁ
బూవులకందువఁబొ
గరములల్లన యెత్తి ఁిరులు గోయఁగఁబూన దోర్మూలరోచులు తొంగలింపఁ
గుచములొకటి నొక్కటి మీఁదిక్రొత్తనెగయ
వలుల జాడలు గనుపట్టివెలయుచుండ, ... కేలిసలిపిరపుఁడు. ౮౦

ఉ. సన్నపుఁగౌనుమీఁద వలిచన్నులవ్రేఁగు ఘనంబు నెవ్వడిం
దన్నకు మమ్మ యోపికచతామరసానన యంచు భీతితోఁ
దన్నొకబోటి ... ... ...
... ... ధజనతాకృతశోకమునయ్యశోకముః. ౮౧

సీ. ఎఱసంజపర్వ నదేలకో యెఱసంజ గాదిది చిగురాకుగముల పెల్లు
చిగురాకుపైఁ దమ్మశ్రేణి యిట్లడరునే తమముగా
...డునేతారక ల్గావిలి కోరకములు
కళికలమీఁద వెన్నెల లుద్భవించునే వెన్నెల గా దిది ఁిరులసొబగు
లనుచు ముగ్ధలు వలుకంగ నతివిదగ్ధ,లల్ల నవ్వుచుఁ దెలుపుదు ర...
, లు దిక్కులనుం జూపువఱపునపుడు. ౮౨

క. డోలాలీల లొనర్చుచుఁ, గేళీసదనంబులందుఁ గ్రీడింపుచుఁ గ్రీ
డాలాపములకు మెచ్చుచు, నాలేమయుఁ బఱియు... ౮౩

సీ. (నీకటాక్షంబులు నెర)సినయెడలెల్లఁ గలువలుపూచిన కరణినుండు
నీమేని నెత్తావి నెగడిన నేపూవు లైనను మంచి వైనట్లు దోఁచు
నీయంగములకాంతి నిండిన లత లెల్లఁ గనకంపులతికలఁ (కరణి వెలయు)
జిగురుల పోల్కినుండుఁ
దెలిసి తెలిసికోయనకానియలరులెపుడుఁ, గోరివిచ్చలవిడిమాకుఁగోయరాదు
నెలఁత నీపొత్తు గలయము నేఁటి కనుచుఁ, బాలఁతినొక్కతె... ౮౪

రామునిగుణములు, సింహములరౌద్రత, జేసః=చతుర్థికి, కైకొఱకూ=కై, కొఱకు-ఇవి వచ్చును. రామునికై, రాములకై, రామునికొఱకు, రాములకొఱకు, కడమవియు నిట్లే తెలియునది. జసిసః=పంచమికి, వలనః=వలన యనునది, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. రామునివలన, రాములవలన.

---

నఃకౌ జమః కు రనితా మందు జిప స్సవిధవర్తినా మిందు

ఇవి నాలుగుసూత్రములు. కౌ=కు అను విభక్తిపరమై యుండిన, నః=న, అనునాగమము వచ్చును. ని అనునది రాదు. అనితాం=ఇకారాంతవ్యతిరిక్తము లైన నామములయొక్క, జమః=షష్ఠికి, కుః=కు అనునది వచ్చును. రామునకు. సామాన్యాకారమున న్యాగమము వచ్చిన నికారాంతరూప మగుచున్నది, కనుక, అనితాం అనుపర్యుదాసచేత కు రాదు. జసఃకిశ్చ-అను సూత్రమున, కి వచ్చును, రామునికి. ఆమ్ రూపమునకుఁ గలదు, రాములకు. జిపః=సప్తమికి, అందు=అందు, అని వచ్చును. రామునియందు, రాములయందు; న్యాగమము నంగీకరింపనివారిపక్షమున, నుమ్వా౽తః, అని నుమ్ము వచ్చిన రామునందు అని కలదు. స్థానబలమునందు, అందు అనియుఁ గలదు. టాస్-మొదలైన విభక్తిసంకేతములు ప్రాకృతశాస్త్రప్రసిద్ధములు. సవిధవర్తినాం=సమీపవర్తులకు, సప్తమ్యంతము-ఇందు=ఇందు అనునది కలదు. ఇందు భుజించె. ఇందు శయనించె.

---

తోడ సహార్థేటాసః పట్టీతి చ పఞ్చమీ గుణే హేతౌ. ౭
కంటేన్యారాదాదే ర్లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ
యొక్కచ శేషేషష్ఠీ విషయనిమిత్తాదిజా తథైవా న్యా॥ ౮

ఈవాక్యత్రయ మూఁడు సూత్రములు. సహార్థే="సహాయుక్తే౽ప్రధానే" అనుశబ్దసూత్రమున వచ్చు, టాసః=తృతీయకు, తోడ=తోడ యనునది వచ్చును. శిష్యులతోడ వచ్చె. గుణే హేతౌ="విభాషా గుణే౽స్త్రియాం" అను శబ్దసూత్రమున వచ్చునట్టి-పఞ్చమీ=పంచమికి, పట్టి ఇతి=పట్టి యనునది వచ్చును. గుణముంబట్టి ధన్యుఁడు, జ్ఞానముంబట్టి ముక్తుఁడు. అన్యారాదాదేః="అన్యారాదాదిషు" అను శబ్దసూత్రమున వచ్చెడుపంచమికి, కంటె=కంటె యనునది వచ్చును. రామునికంటె నన్యుఁడు, వనముకంటెఁ జేరువ. నిర్ధారణోద్భవా="యతశ్చ నిర్ధారణం" అనుశబ్దసూత్రమున వచ్చెడు షష్ఠికి, లోపల=లోపల యనునది వచ్చును. దేవతలలోపల గౌరి యధికురాలు. శేషేషష్ఠీ=

శేషార్థమందు వచ్చుషష్ఠికి, య్యొక్క=య్యొక్క యనునది యగును. అంబయ్యొక్క దాసుఁడు. విషయనిమిత్తాదిజా=విషయనిమిత్తాద్యర్థములం బుట్టిన, అన్యా= సప్తమికి, తథైవ=అట్లలాగుననే యుండును. హరివిషయము, హరినిమిత్తము, ఆదిశబ్దముచేత సతీసప్తమియును వర్తమానార్థ మయియే యుండును. హరిరక్షిం చుచుండఁగాను.

స్యాదమహతాం విభక్తౌ సోశ్చము తదుపరి పునర్బుబూ ప్రాచామ్
సోర్లు గిత ఉత్బహుత్వే సమ్బుద్ధౌ నాదితాం జసః కిశ్చ. ౯

ఇది యాఱుసూత్రములు. అమహతాం=అమహత్తులకు, విభక్తౌ= సప్తవిభక్తులును బరమై యున్నపుడును, సోః=ప్రథమైకవచనమునకు, ఆదేశమై, ము=ము అనునది, స్యాత్=అగును. వనము, ప్రథమైకవచనాదేశము. వన ములు, వనమును, వనముచేత-ఇత్యాది, తదుపరి=ఆమూమీఁదను, పునః= తిరుగ, ముబూ=ము, బు అనునవి వచ్చును. అని, ప్రాచాం=పూర్వులయొక్క మతము. వనము+ము, అని యుండిన, మొదటి ము, సున్నయై ద్విత్వమా యెను, వనమ్ము; బు, ఉండిన నట్లే వనంబు అని రూప మాయెను. ఇతః= ఇకారాంతముమీఁద నుండెడి, సోః=ప్రథమైకవచనమునకు, లుక్=లోప మ గును. హరి, గిరి. బహుత్వే=బహువచనమందు, ఉత్=ఉకారము వచ్చును. హరులు, గిరులు. ఇతాం=ఇకారాంతములకు, సమ్బుద్ధౌ=సంబుద్ధిపరమై యుం డిన, అత్=అదాగమము, న=లేదు. ఓహరి, ఓశౌరి. జసః=షష్ఠ్యైకవచనము నకు, కిః చ=కి, అనునది యాదేశమై వచ్చును. హరికి.

టాదా విత్తో ననిస్స్యా దీదన్తా ఇద్వదేవ కృతహ్రస్వాః
వికృతౌ క్వచిచ్చ లోపో మోర్దీర్ఘ శ్చాత ఆదిమస్య భవేత్. ౧౦

ఇది నాలుగుసూత్రములు. ఇతః=ఇకారాంతమునకు, టాదా=తృతీ యాదివిభక్తి పరమై యున్న, నిః=న్యాగమము, నస్యాత్=లేదు. హరిచేత, హరి వలన. కృతహ్రస్వాః=అనంతరసూత్రముచేత హ్రస్వముం బొందిన, ఈదన్తాః= ఈకారాంతములును, ఇద్వదేవ=ఇకారాంతములవలెనె యుండును. సేనాని, అగ్రణి. వికృతౌ=తెనుఁగునందు, క్వచిత్=ఒక్కొక్కదిక్కున, మోః=మూకు, లోపః=లోప మవును, ఆదిమస్య=ఆమొదటనుండెడు, అతః=అకారమునకును, దీర్ఘశ్చ=దీర్ఘమును వచ్చును. చకారము వలన వికల్ప మనుట, జంపాలు, జొం పాలు.

సర్వత్రోదోతోర్వ్వర్భవతి మువ ద్ధుజ్మహత్పదానాం వా
డుజతౌతు నప్లుతస్స్యాత్సమ్బుద్ధా విత్యుతాం విదుఃకేచిత్. ౧౧

ఇది మూఁడుసూత్రములు. ఉదోతోః=ఉకారాంత, ఓకారాంతములకు, సర్వత్ర=సప్తవిభక్తులయందును, వుః=వు, అనునది, మువత్=ము, అనుదానివలెనే, భవతి=అగుచున్నది. ప్రథమైకవచనమున కాదేశ మయ్యెను గనుక మచోటుల విభక్తి దాపయి యును వచ్చుననుట. గురువు, వస్తువు, ధేనువు, గురువులు, గురువులచేత-ఇత్యాది. ఓకారాంతమునకు, గోవు, గోవుచేత. మహత్పదానాంవా డుజ్-మహత్పదానాం=మహత్పదములకు, వా=వికల్పమున, డుజ్=డుజ్ఞు వచ్చును. విష్ణుఁడు, విష్ణువు, శంభుఁడు, శంభువు. సమ్బుద్ధౌ=సంబుద్ధియందు, ఉతాం=ఉకారాంతములకు, డుజతౌతు—డుజ్=డుజ్ఞును, అత్=అదాగమమును, న=లేవు, ప్లుతః స్యాత్=అంత్యవర్ణమునకుఁ బ్లుతమువచ్చును. ఇతి=ఇట్లని, కేచిత్=కొందఱు, విదుః=తలంతురు. ఓవిష్ణూ! 3, ఓశంభూ! 3. ఇందుకుఁ బ్రయోగము వాగనుశాసనులు తామే చెప్పినారు. "జరత్కారూమునిశ్రేష్ఠ"-"జరత్కారు ర్జరత్కార్వా" అని వ్యాసులు చెప్పినారు. కనుక, ఉకారాంతములు, "కేచిత్" అన్నాఁడు గనుక విష్ణుండ అనియు నుంగలకు.

---

దీర్ఘాణాం హ్రస్వస్స్యాన్నచ దేశ్యపదే నచైకవర్ణేపి
డా బవిధాత్రాదేరు స్తస్యచ వా తావుభౌ రమేశసమౌ. ౧౨

ఇది యాఱు సూత్రములు. దీర్ఘాణాం=దీర్ఘములకెల్ల, హ్రస్వః-స్యాత్=తెనుఁగున హ్రస్వమవును. అంబ, లక్ష్మి, కరభోరు. దేశ్యపదే=దేశీయపుఁదెనుఁగునందు, న చ=లేదు. నవలా, నేఁజా, లకోరీ, ఇత్యాది- ఏకవర్ణేపి=ఏకాక్షరతత్సమమందును, నచ=లేదు. స్త్రీ, శ్రీ, స్త్రీ. డాప్, అవిధాత్రాదేః, ఉః=అవిధాత్రాదేః=విధాత్రాదిగణవ్యతిరిక్తమైన, ఉః=ఉకారాంతమునకు,డాప్=డాప్ అనునది యాదేశము వచ్చును. డాప్లో డకార పకారములు పోఁగా, ఆ- యని శబ్దశాస్త్రన్యాయమున ఋకారమును గొట్టి నిలువఁగా-కర్త, ధాత. తస్యచ=అవిధాత్రాదికిని, వా=వికల్పమున, డాప్వచ్చును. విధాత, మాంధాత. తౌ ఉభౌ=ఆడాబంతౌ ఉడాబంతములు, రెండును, రమేశసమౌ=రమాశబ్ద, ఈశశబ్దములవంటి వౌను. విధాత యనిన రమాశబ్దమువంటిది. విధాత్రుఁడు, ఈశశబ్దమువలెనే యకారాంతమై యుండును.

---

క్వచి దమహతోఽపి డుజ్స్యా దేకాదే రమహతాంచడావున్న
స్త్రీత్వ బహుత్వే సురాదే రసమాసే లుగ్భవే త్కుశాదే ర్మోః. ౧౩

ఇది నాలుగుసూత్రములు. క్వచిత్=ఒక్కొక్కచోట, అమహతోఽపి=అమహత్తునకును, డుజ్స్యాత్=డుజ్ వచ్చును. పుట్టిమొక్కఁడు, వనమొక్కఁడు. ఏకాదేః=ఏకాదిగణమునకును, అమహతాం చ=అమహత్తులకును, డౌ=డుజ్ పరమై యుండిన, ఉత్=ఉకారము, న=లేదు. ఏకాద్యులు-ఒక్కండు, మొరియుండు, సురియుండు, పాపండు, ఇత్యాది. కత్తళఁడు, కైరఁడు, జన్నఁడు, అశ్వవాచకములు. వీనికన్నిటికిని, క్వచిదమహతోఽపి డుజ్స్యాత్, అని డుజ్ వచ్చును. సురాదేః=సురాదిగణమునకు, అసమాసే=సమాసముగానియప్పుడు, స్త్రీత్వబహుత్వే=స్త్రీలింగమును బహువచనమును నగును- సురలు. సమాసమైన భూసురుఁడు. సురాదులు ప్రయోగముచేతఁ దెలిసికొనునది. కుశాదేః=కుశాదిగణముయొక్క, మోః=మూఁకు, లుగ్భవేత్=లోప మగును. కుశ, దర్భ, హంస, దూఁత, ఇత్యాది.

---

షష్ఠీవిశేషణానాం ప్రథమాస్యా ద్వ్యవహితాశ్చ సర్వేస్యుః
వికృతౌచ స్త్రీలిఙ్గాః స్త్రీలిఙ్గకసర్వనామధేయాస్యుః. ౧౪

ఇదిమూఁడుసూత్రములు. షష్ఠీవిశేషణానాం= షష్ఠ్యంతములయొక్క విశేషణములకు, ప్రథమాస్యాత్ = ప్రథమ వచ్చును. "శిష్టవత్సల గౌరి కాత్రితుఁడ నేను". సర్వే= సర్వవిభక్తివిశేషణములును, వ్యవహితాశ్చ =విశేష్యముతో వ్యవధానము గలిగియును (అడ్డముగలిగియును) నుండును.

గీ. ఆశ్రితావన సురల ము న్నంబ ప్రోచె, శంకరునిరాణి నర్చింతు శైలసుతను
ఇందువదనకుఁ బ్రణతి సర్వేశ్వరికిని,యాద్యయం దనురక్తిమాయార్యయందు.

స్త్రీలిఙ్గాః= స్త్రీలింగపదములు , వికృతౌచ= తెనుఁగునందును, స్త్రీలిఙ్గకసర్వనామధేయాః= స్త్రీలింగములైనవిశేషణవిశేష్యములుగలవి, స్యుః= అవును. చకారమువలన సంస్కృత స్త్రీలింగపదవిశేషణములు స్త్రీలింగములే యనుట. గౌరి భక్తవత్సల, గట్టురాపట్టి యాపన్నవరద.

---

ఉభయవిధ మమహతీనాం నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్
ఇతరత్రచ ద్వితీయా తస్యాః ప్రథమాచ జడపదానాంస్యాత్. ౧౫

ఇది నాలుగుసూత్రములు. అమహతీనాం= అమహత్తులైన స్త్రీలింగములకు, ఉభయవిధం=పుంలింగ స్త్రీలింగరూపవిశేషణములు రెండును గలవు.

శరచ్చంద్రిక మనోహరము, పుష్పలత మనోహర- సర్వాసాం= స్త్రీవాచక ములైన తెనుఁగు సంస్కృతముల కన్నింటికి, విశేషణములకు, స్త్రీప్రత్యయః= జీప్, జీషులు మొదలైన స్త్రీ ప్రత్యయములు, నియతః=ఆవశ్యకము. శరచ్చంద్రిక తాపాపహారిణి, మిన్నేరు శివజటాజూటవాసిని, అంబ సకలజగత్కర్త్రి. ద్వితీయా=ద్వితీయావిభక్తి, ఇతరత్ర చ=తనచోటఁగాక కడమవిభక్తులచోటను వచ్చును. హేతిని నఱకెను, తృతీయయందు ద్వితీయ. ద్వారక నున్నాఁడు, సప్తమియందు ద్వితీయ. జడపదానాం=జడపదములయొక్క, తస్యాః =ఆద్వితీయకు, ప్రథమాచ= ప్రథమావిభక్తియును, స్యాత్ = అగును. కొండదిగె, రథ మ్మెక్కె- చకారమువలన ద్వితీయయు నుండును. వనమును జేరి.

---

స్తోవావౌ రైనావోః స్త్రీవద్గ్లౌ ర్భ్వాదివోస్తు జౌయత్తత్
వాయిరవు ర్వక్రతమా వృద్ద్వన్ద్వే ఽరః క్వచి ద్గకారోవః. ౧౯

ఇది యాఱుసూత్రములు. రైనావోః=రై శబ్ద నౌశబ్దములకుఁ దుదను, అవావౌ=ఓ కారమును, అనయునదియు (ఓ + అవ, అవావౌ)స్తః=అగును. రో, నావ- గ్లౌః=గ్లౌశబ్దము, స్త్రీవత్ =స్త్రీశబ్దమువంటి దౌను, ఏకాక్షరమై నిలుచు ననుట, గ్లా. భూదివోస్తు=భూ, దివ్ శబ్దములకు, జౌ=సంస్కృతము లో సప్తమ్యేకవచనమందు, యత్ =ఏరూపమో, తత్ =ఆరూపమే యగును, భువి, దివి. వక్రతమా=ఐ, ఔలు, వా=వికల్పమున, అయి రవుః=అయి, అవు, అని యుండును కైలు, కయిలు; ఔరా, అవురా. ద్వన్ద్వే=ద్వంద్వసమాసమందలి, ఉః=ఋ కారమునకు, క్వచిత్ =కొన్నిచోటుల, రః=రేఫమగును. మాత్రపితృభావనను శైలపుత్రిఁ గొలుతు. కొంద ఱీ క్వచిచ్ఛబ్దము నుత్తరమునకే యన్వయించుకొందురు. గః=గ కారము, క్వచిత్ =కొన్నిచోటుల, వః=వకారమౌను. ప్రేగులు, ప్రేవులు; తొగలు, తొవలు; పగలు, పవలు; ఇత్యాది.

---

న్వన్తా న్నామ్నః కుజ్నోర్బహువచనే కుత్రచి న్నులోపశ్చ
సలలో ర్బిన్దుయుతో డుర్వా లులయో రుల్లుగపి తయోః పరతః. ౨౦

ఇది మూఁడుసూత్రములు. న్వన్తాత్ =నుకారము తుదయందుఁ గల, నామ్నః=శబ్దమునుండి, నోః=నుకారమునకు, బహువచనే=బహువచన మందు, కుజ్ =కుజాదేశ మగును. జకార మిత్తయిపోయిన, జిత్తు గనుక యర్థబిం

దుయుక్తమగును.* కొలను, కొలఁకులు; కెలను, కెలఁకులు, మ్రాను, మ్రాఁకులు; క్వచిత్ = కొన్నిటియందు, నులోపశ్చ = నుకారలోపమును నగును. చేను, చేలు; మీను, మీలు. చకారప్రయోగముచేతఁ గొన్నింటికి లోపము లేదు. మేనులు, కానులు. లులయోః = లు, ల, అనునవి పరమై యుండిన, సలలోః = లకారయుక్తమైనలుకారమునకు, వా = వికల్పమున, బిన్దుయుతః = సున్నతోఁగూడిన, డుః = డుకారము, వచ్చును. తయోః = ఆలులలకు, పరతః = పరమైయుండెడు, ఉల్లుగపి = ఉకారలోపము నగును. విల్లు, అనులకారయుక్తమైనలూకు విండులు, అని వచ్చును. ఉకారలోపమైన, విండ్లు, అని వచ్చును. వికల్పము గనుక విల్లును గలదు. ముండ్లు, ముండ్ల, ముండ్లమ్రాను, "బహువచనే" అనుపదమనువర్తించుచున్నది.

---

నిత్యం దారాదేశ్చ స్యాల్లో ర్లులయో రురౌచ తత్రస్తః
రోలో డలటా ముదితాం తస్య చవా లుక్సలోలోశ్చ. ౧౮

ఇది నాలుగు సూత్రములు. దారాదేశ్చ = దారాదిగణముయొక్క, లోః = లుకారమునకు, లులయోః = లులలుపరమైయుండిన, నిత్యం = నిత్యముగాను, బహువచనే = బహువచనమునందు, డుః = డు అనునది వచ్చును. (బహువచనడువర్ణకము లనువర్తించుచున్నవి) దారాదు లనఁగా, ఆలు మొదలైన తెనుఁగు శబ్దములు. తత్ర = ఆదారాదులయందలి, లులయోః = లు, ల, యనువానికి, రురౌ చ = రు, ర, యనునవియు, స్తః = అవును. ఆండ్రు, జవరాండ్రు, కోడండ్రు, చెల్లెండ్రు; వాండ్రు, వీండ్రు, విలుకాండ్రు, అనుస్థలములడకారము మునుపే యున్నది. దారాదులలోనివి గనుక రురలు వచ్చినవి. రః = ర అనుదానికి, లులలుపరమై యుండిన, లః = ళకారము వచ్చును. గోరు, గోళ్ళు; ఏఱు, ఏళ్ళు; ఉత్తరసూత్రముచేత, ఉకారలోపమైనది. డలటాం = డ, ల, ట, అను నీమూఁటియొక్క, ఉదితాం = ఉకార, ఇకారములకు, తస్య చ = మునుపటిసూత్రమునందుఁ జెప్పఁబడిన, రు అనువానియొక్క యుకారమునకు, వా లుక్ = వికల్పముగ లోపము వచ్చును. వికల్పము గనుక గోరులు అనియుం గలదు. రః = అని పొల్లు రేఫ చెప్పినాఁడు గనుక, ఉకారలోపము లేనప్పుడు లకారాదేశము రాదు. పాడి, పాళ్లు; త్రాడు, త్రాళ్లు; అంబలి, అంబళ్లు; చాలు, చాళ్లు; చెట్టు, చెట్లు; పెట్టు, పెట్లు; జట్టి, జట్లు; పెంటి, పెంట్లు; ఇత్యాది. సలః = లకారయుక్తమైన, లోశ్చ = ళుకారమునకును, ఉకారలోపమగును. పంది ళ్వేసి, అంబళ్వార్చి.

---

* కొలను, కొలంగ్ కులు; కెలను, కెలగ్ కులు, మ్రాను, మ్రాగ్ కులు-పా.

ఔపవిభక్తికలీనా మిల్లు గ్బహుళం తథైవ డు శ్చ స్యాత్
అపి సంయుక్తసమాప్తౌ భూయోన్తే లుక్ప్రదృశ్యతే నామ్నామ్. ౧౯

ఇది రెండు సూత్రములు. ఔపవిభక్తికలీనాం=ఔపవిభక్తికములయందలి లి యనునక్షరమునకు, ఇల్లుక్, బహుళం=బహుళముగా, ఇకారలోపమగును. తథైవ=ఆలాగుననే, డుశ్చ=డుకారమును, స్యాత్=అగును. గుద్దలి, ఇకారలోపమై, ఉకారము వచ్చి, గుద్దండ్లు, గొడ్డండ్లు, గోకండ్లు, ఇత్యాది బహుళగ్రహణముచేత, పందిలి-ఔపవిభక్తికమైనను రాదు. పెండిలి-ఔపవిభక్తికము కాకున్నను వచ్చెను. పెండ్లిండ్లు. లుః=లుకారము, సంయుక్తసమాప్తౌ, అపి=నామాంత్యాక్షరములతో స యుక్త మై ముగిసి పోయియు ను, నామ్నాం=నామములయొక్క, అన్తే = తుదయందు, భూయః ప్రదృశ్యతే= మరలఁ గనిపించును. ఇండ్లులు, పండ్లులు, పెండ్లులు-ఇత్యాది.

---

కేషాంచి దుదన్తానాం నేతి విభక్తౌ వునో లుక్స్యాత్
ఔపవిభక్తికనామ్నా మత్వంస్యా త్సప్తమీతృతీయార్థే. ౨౦

ఇది రెండుసూత్రములు. కేషాంచిత్=కొన్నియైన, ఉదన్తానాం=ఉకారాంతములకు, నేతి విభక్తౌ=న, అను సప్తమియందు, ఉనః=ఉన్ అనుదానికి, లుక్ స్యాత్=లోప మగును. (మేరున) చోటున, అనుసప్తమ్యంతమందు, టులోని, ఉకారమును న లోనిపొల్లును గూడి, ఉన్ అగును. దానికి లోపమయిన, "చోట" అని నిల్చెను. ఇటులే, ఊర, నడుమ, మీఁద మొదలైన రూపములు. ఔపవిభక్తికనామ్నాం=ఔపవిభక్తికనామములకు, సప్తమీతృతీయార్థే=సప్తమీతృతీయార్థములయందు, అత్వం స్యాత్=అకారము వచ్చును, విల్లు-అనుసౌపవిభక్తికనామమునకుసప్తమ్యర్థమందు, అత్వము వచ్చెను గనుక టివర్ణములోనియికార మకారమాయెను-వింట, ఇంట, మింట, కంట,ఇత్యాది.

---

అనుతాం స్త్రీయాం సమానాం సర్వస్య స్త్రీసమస్యచ సులోపః
ఏదన్తతాచ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్. ౨౧

ఇది రెండు సూత్రములు. అనుతాం=ఉదంత వ్యతిరిక్తము లైన, సమానాం=తత్సమములకు, స్త్రీయాం=స్త్రీలింగమందును, సర్వస్యచ=ఉదంతములుసహా గా సమస్తమైన, స్త్రీసమస్య చ=స్త్రీసమశబ్దములకును, సులోపః=ప్రథ

మైకవచనలోప మౌను. అంబాశబ్దమున కీసూత్రమున నేకవచనలోప మై "దీర్ఘాణాం హ్రస్వః స్యాత్ " అని హ్రస్వము వచ్చిన, అంబ యని నిల్చెను. ఇట్లే గౌరి, వాణి మొదలైనవి. అనుతాం, అన్నాఁడు గనుక, ఉకారాంతములకు లేదు. భీరువు, చంచువు. వు అనువర్ణకము వచ్చునని మునుపే చెప్పినారము. గోడ, మేడ మొదలైనవి స్త్రీసమములు. ఇయాన్తానాం=ఇయయనునది తుదగాఁగల, నామ్నాం=నామములయొక్క తుదకు, అన్యతరస్యాం=వికల్పమున, ఏదన్తతా చ=ఏకారాంతత్వమును, అగును. గద్దియ, గద్దె-సురియ, సురె-ఇత్యాది. నామాఁత్యత్వము గ్రహించుకొని, ముత్తెము, ముత్తియము; విడెము, విడియము-ఇత్యాదులయందును జెప్పుకొనునది.

---

వికృతౌ సద్దేశ్యాః క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యే స్యుః
క్లీబసమా అమహద్వత్ స్త్రీవత్స్యుః స్త్రీసమా స్సమాస్తు సమాః. ౨౨

ఇది నాలుగుసూత్రములు. వికృతౌ=తెనుఁగునందు, సద్దేశ్యాః=దేశ్యశబ్దము లన్నియు, క్లీబసమాః=నపుంసకసమములు ను, స్త్రీసమాశ్చ=స్త్రీసమములును గాని- అన్యే=పుంసమములు, నస్యుః=లేవు. క్లీబసమాః=నపుంసకసమములు, అమహద్వత్ =అమహత్తులైన తత్సమములవంటివి యగును. "ము ర మహతాం " అని ము వచ్చు ననుట. అందము, చందము, గుఱ్ఱము, పల్లము-ఇత్యాది. స్త్రీసమాః=స్త్రీసమములు, స్త్రీవత్ =స్త్రీలింగ తత్సమములవంటివి, స్యుః=అవును. హ్రస్వవిభక్తిలోపము లగు ననుట- గోడ, మేడ, మోవి, బావి చామ, మోరు, పుల్లె, పల్లె, ఎల్ల-ఇత్యాది. సమాస్తు=తత్సమములు, సమాః= యథాపూర్వ సమములై యుండును. రాముఁడు, సీత, రఘుకులము.

శా. కర్ణాంతాయతచారునేత్ర కమలాకర్పూరకూర్చత్రపా
వర్ణ శ్రీకర మంత్రసాదిత విభాస్వద్రూప చిద్రూప సౌ
వర్ణోదంచిత మంచ బిందు మయ దీవ్యద్దివ్య సింహాసనాం
తర్ణిష్పంద విహార *హారకలికోద్యత్కాంచికాభూషణా.

గద్యము-ఇది శ్రీసకలభాషావాగనుశాసననన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతి కవిమహోపాధ్యాయప్రణీతంబైన టీకాగ్రంథంబునం దజంతపరిచ్ఛేదము.

* పద. కలికా—పా.

పాలింప లేఁ దయా ప్రభు వెందు నీకన్న నీకన్నబిడ్డని వీఁక నెన్ను
పతితుండు లేఁడయా పరికింప నాకన్న నాకన్నమహినొప్పు నరులలోనఁ
బడుచున్న పాటు లెప్పుడుఁ జెల్పనా విన్న నావిన్నఁదన మింకఁ బోవఁజూడు
గతినీవె లేరికఁ గడతేర్పు నాయన్న నాయన్నమాటల న్యాయ మెఱిఁగి
యిది నిజం బని కరుణ నన్నేలితేని, కేనియవిధంబు నీకథలానలేనె, చారుఁగ
వినిపింతు నిదె నాకవిత్వంబు తాళరా తాళరాగైక్యనృత్యప్రమోద
నీవె దైవము నాకు నీపదమానరా మానరా జాగు రామానుజన్న
నాకింత కెన్నిజన్మంబులో యెంచరా యంచరాయనిసాదిఁ గాంచినవారి
ప్రబలతాపత్రయబాధల కోపరా కోపరాగస్వాంతకుజనదూర
యరసియిఁక నైన నామొఱ నాలకింపు, కింపురుషయక్షగంధర్వకృతసపర్య-
సిద్ధింపనేర్చునే శ్రేయోనిశాంతంబు శాంతంబు నావంటిచపలమతికి
సమకూడనేర్చునే సంపన్నిదానంబు దానంబు నావంటి హీనగతికిఁ
జేకూరనేర్చునే చింతావియోగంబు యోగంబు నావంటి భోగరతికిఁ
బొసఁగంగనేర్చునే భూతహితత్వంబు తత్త్వంబు నావంటి దైన్యకృతికిఁ
గాన నిటువంటి పతితుఁడ నైన నాకు, నాకుజాతునికట్ల నీనామమబ్బెఁ, జా.
నీపార్శ్వముల రుక్మిణీసత్యభామలు భామలస్మితముఖులై వసింప
నీయోష్ఠమునఁ గరాన్వితవేణుకాండంబు కాండంబునించురాగమున నొప్ప
నీశయద్వయిని మానితశంఖచక్రముల్ చక్రము ల్వేలయు తేజమునఁ దనర
నీమేన నిర్మలహేమాభవాసంబు వాసంబు దీపించు వన్నె నలర
నుదుటఁ గస్తూరితిలకంబు నొదలమించు, మించునీమూర్తిఁ గాంచి సేవించువాఁడఁ-
భూపీకృతామ్నాయభావనాచరణము ల్చరణముల్వ్యత్యస్తసరణి నిలిపి
యశ్రాంతసంశోషితాభీరవంశంబు వంశంబు మోవిపై వఱలఁజేసి
వర్షావసరచరద్వారిదాబర్హంబు బర్హంబు మౌళి నేర్పడ ఘటించి
జితిభూభయంకర దేవతాసుముఖంబు సుముఖంబు నొరగా సొంపొనర్చి
నట్టి నీదివ్యమగు తేజ మనువియోగ, యోగవేళఁ గనంబడు నొక్కొ నాకుఁ
జారుతరమందహాసపోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౦

— (3) పితృమాతృదశకము. —

మొదలనె బ్రహ్మంబు పదునాల్గుభువనము ల్భువనము లొంకిగాఁ బూనెఁ గుక్షి
వంతనే విభుఁ డాద్యుఁడై మహదాదుల దాదులఁగా స్వతంత్రత విధించె

తీవి నేమేధావి జీవపార్శ్వస్థుఁడై స్వస్థుఁడై వటపత్రశాయి యయ్యెఁ
జెలఁగి యేదేవుండు సృష్టిసంధాతను ధాతను నాభిపద్మమునఁ గాంచె
నట్టినిను దేవకిపిచండమందు దేవ, దేవ నవమాసములు మోచి తిరుగుటరిది
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౧

శంఖచక్రగదాసిసాధనోత్తరములు కరములు నాలుగు పరిఢవిల్ల
ధృతకిరీటాధరీకృత భాస్వమస్తంబు మస్తంబు నిస్తులమహిమ నొప్ప
లలితరేఖాభాసిలక్షణాస్పదములు పదములు పల్లవప్రభల నలరఁ
బూర్ణప్రతీకస్థభూషానికాయంబు కాయంబు దివ్యమంగళతఁ దనర
నెసఁగునిటువంటినినుఁబుటటింటఁగన్న, కన్నతలిదండ్రులెంతసంపన్నులొక్కొ.

ప్రచలితహేమాద్రి పక్షావిశేషుఁడై శేషుఁడై పూనె నేజితజడాగ్రి
విధినిశివేళ నుదధిఁ బాఱ మత్స్యమై మత్స్యమై త్రిప్పె నేమహితకీర్తి
తరువంగఁ గ్రుంగు మంధానాద్రిఁ గూర్మమై గూర్మమైమోచె నేధర్మవర్తి
యతలస్థమహిఁ దిరస్కృతసోమఘృష్టియై ఘృష్టియైయెత్తె నేస్పష్టమూర్తి
యట్టినినుఁగాంచువసుదేవుఁడతిరయమున, యమునదాఁటివ్రేపల్లెకునరుగుటరిది

ముందఱ నిడుకొని ముదుక నేర్పరిపాటి పరిపాటి తైలంబు శిరమునంటి
యూరువులందిడి యుదకశీకరములఁ గరములు సున్నితోఁ గలయ బులిమి
మృదులోష్ణధూతహరిద్రకృజ్జలముల జలముల దోయిట జలకమార్చి
కడువేగముగ మేనితడిని బయ్యెదనంట నెదనంటఁ జేర్చి పెంపొదవనొత్తి
కుత్తుకకు డాయఁ జేతుల నెత్తిపట్టి, పట్టివని ముద్దుగొను తల్లి భాగ్యమే మొ-

నిటలస్థలిని జ్యోతిఘటియించుఁ గావునఁ గావునఁ బోరిడి కలఁగు వేళ
బొమలక్రిందున రేఖ నమరించుభసితంబు భసితంబు కడు దుళ్ళి పడెడువేళ
నొకచెక్కిటనె రక్ష నుంచు నంజనముచే జనముచేకొని ముద్దుగొనెడువేళ
మొలత్రాట నింగువ ముడిచిన ముడిపెట్టు ముడిపెట్టిపురుడంటి బడలువేళ
నందసతియిట్లునినులోచనముతఁగాంచి, కాంచినవధూటికధికంబుగాఁగఁ బెంచె-

ప్రక్కలో నిడుకొని పలుమాఱు జోకొట్టి జోకొట్టి పుణుకుచు జోలవాడుఁ
బోరువెట్టిన భుజంబునఁ జేర్చి చిచ్చోసి చిచ్చోసి యని వ్రేళ్ళఁ జిచ్చుకొట్టు
హాయి రేయనుచు నుయ్యాలనుంచి లాలించి లాలించి మెల్లమెల్లనఁ గదల్చు
బూచివచ్చెనటంచు బుసవెట్టి బెదరించి బెదరించి మీఁగాళ్ళఁ బెట్టియూఁచు
నిన్ను నిన్నివిధంబుల నిద్రఁబుచ్చి,బుచ్చిశిశువంచుఁ దల్లిపాలిచ్చు లేపి, చా.

వనమాలికేవలార్భకుఁడనఁ జనుబాలుఁ జనుబాలు గుడుపవే సమయమెఱిఁగి
వినఁజాలఁ బ్రొద్దెక్కె ననుచు నీవెన్నఁగా వెన్నఁగాచిననేతి నన్నమిడవె
లీల నుయ్యెలఁ బవ్వళించి పెంపొందుగాఁ బొందుగా నిఁకని ద్రపుచ్చఁదగదె
తడవాయె నిద్రించి తాళఁ డాఁకలికినోఁ కలికి నేర్పున మేలుకొలుపఁగదవె
యనుచు నందుండు నీతల్లి ననుచుటప్పు, టప్పటికి నెన్నఁగాంచు మోహమునఁ గాదె-
నునురావిరేక నెన్నుదుటిపై నలకల నలకలాపాగ్రణిన్మై మెలంగ
నురమునఁ బచ్చల నొప్పి యొప్పులెగోరు పులిగోరుపతకంబు పొంకమలర
నడుమున మణివితానపు మొలుఁగంటల గంటల మొలనూలు గల్లురనఁగఁ
దళతళదివ్యరత్నప్రభావలయము ల్వలయముల్ హస్తాగ్రములఁ జెలంగఁ
దనరు నీజానుయానంబు తల్లి చూచుఁ, జూచుకంబులఁ బాలిచ్చి చొక్కఁగాదె-
కుడువ రాచను బువ్వగడియలో నుడుకు నే నుడుకు నేర్పున నూఁదియిడుదు ననుచు
మీఁగడ పెరుఁగుతో మెసవు మోగిరము వేగిరము వేడుక సుభాకృతియటంచుఁ
జెచ్చెర భక్షింపు చేకొని యీ వెన్న యీ వెన్న నేల నన్నెప్పు డనుచుఁ
ద్రాగురా నునుపంచదారతో నీపాలు నీపాలు సున్ని లేఁ బాప యనుచు
నిత్యము నుజిన్ని పాయపు నిన్న భూత, భూతదయగల్గుజనయిత్రి బుజ్జగించుఁ-
శింశుమారస్థ దివ్యాంశు విగ్రహముల గ్రహములఁ దారల రాశికములఁ
బూర్వదిక్పాలాదిపుటభేదనంబుల నంబులఁ దనరుసప్తార్ణవముల
భూజలాగ్ని మరున్నభోభూతగణముల గణములు దిశల నాకాశచరుల
నతలాద్యధోలోకగతఫణిసత్వముల సత్వములు జంగమస్థావరముల
మృత్తుఁ గనుమంచు నీవు నోరెత్తఁగాంచెఁ, గాంచనాంశుక జననినీగర్భమందుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. 30

—(4) బాలదశకము. —

నరుల కిందలిజీవనంబులు భంగముల్ భంగము ల్జీవనప్రతతియందుఁ
జరము లిందలి గోవృషస్త్రీసురత్నము ల గణ్యము ల్లన నచరంబు లందు
నమృతాప్తికిందు ననాయాసమథనంబు మథనంబు లమృతసంప్రాప్తికందు
నిందవస్థలమూఁట నందాత్మచర్యలు చర్యలు రెండవస్థలనె యందు
ననిక దా వార్ధిఁ దొలఁగి బాల్యమునఁ బాడి, పాఁడిపంటలుగల్గు వ్రేపల్లెనుంట
దారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. 31

త్రైస్త్రిక్తప్రసూతజ్ఞని సారెకుఁ సారెకుఁ దోలునొత్తఁ జప్పరించి
పిదపఁ దజ్జనయిత్రి పృథుకుచాహారంబు సారంబుగలతనుస్తన్యమౌని [వి
యుభయసంధ్యలయందునుగ్గునాముదముతో ముదముతోఁ జనుబ్రాలుపిసుకఁ ద్రా
త్తూర్ణదూరీకృతాజీర్ణవికారంబు కారంబు వారసంగతిని గ్రోలి
యలరెతివిగాదెతచ్ఛైశవానుభవము, భవముగలవారలకుఁ గదా ప్రాప్తముగుట-
నులుకకంకటిఁ బ్రొత్తియలఁ గూర్చునెమ్మది నెమ్మది వటపలాశమ్ముఁ దలఁకు
వెడనెడఁ జనుబ్రాలుగుడుచుఁ దానుదురుచినుమురుచిక్రతువపాహుతిదలంప
వాభీరజనమనోహరణమౌనవలీల నవలీల లసి విభువ్యక్తి దలఁప
వధిగతదధిభాండ మథనస్వనంబున నంబునర్గి రావంబు దలఁప
వంబపతిభక్తిచే నలోపంబునంపు, నంపుసంపత్తి గనుటవిన్నొందె మఱపు-
వరకుంతలాళిభాస్వన్ముఖపద్మచేఁ బద్మచేఁ గను నొత్తఁబడిన వెవ్వి
పావనకృత్తుంగభంగత్వగంగకు గంగకుభవజనకంబు లెవ్వి
యచలితయోగియోగానుసంధానప్రధానప్రచారంబు లైన వెవ్వి
సకలవర్ణాశ్రమాచార విస్తుతులంపు శ్రుతులంపు నృత్యాంబు ద్రొక్కె నెవ్వి
యిట్టి నీపాదములు నందునింట బెదరి
బెదరికని తప్పటడుగులు పెట్టుటరిది, చారు. ౩౮

అమ్మ పాలిప్పు డిమ్మని పటాంచలముఁ జంచలము చెందఁగఁ బట్టుసమయమందు
నమ్మ వెన్నయొసఁగు మనినుంఖదండంబు దండంబునిడి పట్టుతఱిని మఱియు
నవ్వపెట్టవె బువ్వ యని లీల వ్రేలిచే వ్రేలు చేకొని పట్టువేళయందు
నప్పచ్చి దే తల్లి యని శుభాకరములు కరము లడ్డమువట్టు కాలమందు
నిట్టినీశైశవక్రీడలింతియెన్ని, యెన్ని పనులున్న మానినీయిష్టమొసఁగుఁ, జారు.

సతతభక్షితమఘాహుతిసరసాన్నంబు సన్నంబుగాఁ దిన సరణిమొసవ
సర్వవేదాకృతి శ్వరపలుకులు పలుకులు గడుముద్దుగులుకఁ బలుకఁ
బ్రాణ్యంతరనుగత పాదపల్లవముల లవములగతి వీథి లగువులెత్త
శ్రుతిరవాకర్ణనశ్రుతివల్లవార్తల వార్తల సార్థక్యవ్యక్తి వినఁగ
నేర్చుకొను టద్భుతము గాదె నీవు మంద
మందచర్యలఁ బ్రాకృతుమ్మాడ్కిమెలఁగి, చారు. ౩౯

ఆత్మాలయము దాఁటునంతకు నడుగున నడుగు నవీనకుహాకతనిడుచు
నవలివీథికిఁ బోవునంతకుఁ బదమెత్తి పదమెత్తితిన్నగాఁ బాడుకొనుచు

నరసి సేస్తులఁ గూడునంతకు నల్లన నల్లనఁ గనువారి నడిగికొనుచు
నచటఁ బెన్నుద్ది యా నంతకు గొబ్బున గొబ్బునఁ గసరి కేగో యటంచు
నాటలకు వేఁట వెడలి ఘోయనుచునంత,నంతభూర్తశిఖామణివైతివౌర, చారు.

అన్న రా మనమాటలాడంగఁబోవలెఁ బో వలెవాటెంకఁ బోనఁగదోయి
తల్లులు గనికొట్టఁ దలఁతురు మనముల మనములఁ గోపంబు మాన రెపుడు
వెన్న దొంగిలి తెత్తు విను మన కిరువుర కిరువు రథోదరం బీదినంబు
ఆటల కధికుల మయ్య యీమందలో మందలోలాత్మడింభకులకన్న
ననుచు నమ్మించి సకలగుణాభిరాము
రాముఁ దోడ్కొని రాజమార్గంబుసారవె, చారు. ౩౮

సంహిత విని వచోర్ఘురిఁ బదక్రమముల క్రమములఁ దప్పక ఘనను చెప్పి
సాము చూచి ప్రయోగసంహార మనువుల మనువులస్మృతికీతిమహిమ తెన్ని
క్రయవిక్రయస్థితు ల్గని యాదివృద్ధుల వృద్ధులగతి వివరించి మించి
ఋనుల నన్నిటిఁ గాంచి బహువిధోపాయము ల్పాయముల్గల వారిఫణితిఁ దెలిపి
ప్రబలు నిను ముఖబాహూరుపాదజన్మ
జన్మబాలురు గని నిల్వఁజాల రెదుటఁ, చారు. ౩౯

గళదచ్ఛదధిపయఃకణమై వశీకర శీకరకణము నిరాకరించి
లవరజస్సహితావయవమై విభూతిద భూతిదనర్చు శంభుని నెదిర్చి
చలదలకాస్యమై జలదపోతాంజనతాంజనగిరి శృంగ మపహసించి
నవనీతదిగ్ధమై పవిభవాభాసిత భాసితహరినీల మోసరించి
భువనమోహనమగునీదుబుడుతమూర్తి, మూర్తిమంతంబుఁజూపినాయార్తినుడుపు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౪౦

## (5) చోరత్వదశకము.

ఉదయాద్రి నేధనాథ్యులకైనఁ జిక్కని చిక్కని పెరుఁగు వాసింప జుట్టి
ప్రొద్దు జామైన సేపుణ్యులకందని కందని వెన్న నింపొంద మ్రెక్కి
మధ్యాహ్నవేళ నెమ్మది నట్టుగట్టిన గట్టినయంపు మీఁగడలు మెసవి
యపరాహ్ణమున నెట్టనై తడవారిన వారినంటని పాలు వడిగఁ ద్రావి
ప్రతిదినం బిట్టిచోరకర్మప్రసిద్ధి, సిద్ధవడసితి వే మంద నుద్ధరింపఁ
చారుతరమందహాస పోలూరి వాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౪౧

ఉట్టిఁగట్టిన వెన్న నొడియుచు నందక నందకధర కుంతనడుము పొడిచి
పులుసైనదధి ద్రావఁగలఁగుచు గదిపంచ గది పంచదార నేకలయఁబోసి
కాఁగుభాండములమీఁగడ లంట లావతి లావరి ధరవానిఁ బోవ నడిచి
కళకళఁబారలు దుగ్ధములానఁదటిగాక దరి కాఁక చన మధు వరసి నించి
శార్ఙ్గి నీవిట్టులనుభవించ వెయసాధ్య,సాధ్యకర్ముఁడవై బాల్యసమయమందుఁ, జా.

సమయ మెఱింగి వే చప్పుడు గాకుండఁ గాఁగుండలోఁ బాలు గఱచి త్రావి
పనులకై యొకబోఁటి చనుచోట నంతలో నంతలోలత వెన్న లరసి స్వీక్రి
త్రచ్చుకవ్వము నిల్పి వచ్చుకాంతను గాంచి తనుకాంచిరవుఁడవైదధిని జుఱ్ఱి
పొరుగున కొకవ్రేత మెరవడి చన్నంతఁ జన్నంతమీఁగడఁ జాల మెసవి
గండిదొంగలకగ్రేసరుండవైన,వైనతేయాశ్వనాకర్మవసువుగొనుము, చారు.

చెలులు వ్రేఁకటి నెడశిశువులకాఁగిన కాఁగినపాలార్చి కాని కొనవు
ఎటు చలింపనిఱాతి కెట్టిబా గట్టిది గట్టిది పెరుఁ గైనఁ గాని కొనవు
మిగులఁ గాఁగినపాలమీఁదఁ బాఁగనిపించు గనిపించుమీఁగడఁగానికొనవు
పెనుగానుచల్లలో మునుఁగక పైనిగ్గు పైనిగ్గు గల వెన్నగాని కొనవు
కోరుకులఁ జోరు లిటు దీర్చుకొనఁగఁగలరె
కలరె నీవంటి కన్నదొంగలు ధరిత్రిఁ, జారు. ౪౪

అంబతోఁ జెప్పెద ననుసారసాక్షిని సాక్షినిదోడ్పొని చను మటంచు
మరలి వచ్చిన నిన్ను మర్దింతు ననుబోఁటి ననుబోటి నీకుఁ జిక్కునెయటంచు
నిరుగువా రెఱుఁగఁ గు య్యిడు మచ్చెకంటిని గఁటిని నీపాడికలిమి ననుచు
నిన్నేమియనఁజాలనన్నకాంచనగాత్రిఁజనఁగాత్రివారంబుగొనక యనుచుఁ
దొడరి నీవిట్లు వ్రేతలతోడ మంద,మందలింపవె చోరకర్మములవేళఁ, జారు.

తెంపరి గాకున్న సంపత్తి పెరుఁగునే పెరుఁగు నేఁటి కొసంగు పృథునితంబ
చెనఁటికిఁ బాఁడివృద్ధినిఁ బొందునా పాలు నాపాలు గావింపు నాగయాన
నింపురచ్చలలోన నీహిత వెన్ననా వెన్న నావశము గావింపు తగుణి
తిట్టి నన్నదలింపఁ బట్టకు మీఁగడె మీఁగడ గొనువాఁడ మీననయన
యని వ్రజస్త్రీల నర్థించి నెనరుగలుగఁ
గలుగని యుపాయముల మంద నలరితౌర, చారు. ౪౫

గోవత్సరావసంకులగృహాంతరములఁ దరములు గడచుపద్ధతులఁ జూచి
దంపతీకలహప్రకంపితాలయముల లయములఁ గనని లౌల్యమునఁ జొచ్చి

బాలవృద్ధార్భటిభయదమందిరములఁ దిరము లఘువ్యక్తి నరసిచొచ్చి
వ్యాకీర్ణనిలోల్యత్సవస్త్రీబవంతుల వంతుల నెన్నుచు వరుసఁజొచ్చి
యట్టెసందడివేళల నాడి పాడి, పాఁడి సకలంబుగొని కొల్లలాడితౌర, చారు.

దొరకొడుకై యుండి దొంగిల నేటికే నేటికేవలులమే నీకు మేము
పూని యేమిడలేము వానికోర్కులు మేలు కులమేలువాని కీగుణము గలదె
రట్టుచేయఁగనందటము కానివారమా వార మాటడిచేయవలెనె యెపుడుఁ
గలఁచి హావ్యముల నెంగిలి చేయఁబాడియే పాఁడియేమర్యాద ప్రబలునింక
ననుచు వ్రేతలు దెలుపనీయంబవారి, వారివారించు నేరనివాఁడవంచుఁ, జారు.

నిలయంబులనుజొచ్చు నేర్పుదొంగలయందుఁ గలయందు నెన్నఁడుఁ గానమనుచు
ననుపమాత్మ ప్రిసర్వాదనామునియందు మునియందుఁ జెప్పఁగావినమటంచు
సంచారచపలంబుశంపార్భకములందుఁ గములందు నేనాఁడుఁ గనమదనుచుఁ
మిథ్యావచోభవామృతము తే నెలయందు నెలయందు నేభంగిఁ గలుగదనుచుఁ
బలుకు వ్రేతల యిండ్లలోఁ బాఁడిమరల
మరలఁ జెలరేఁగి కొనవె డింభకులఁ దనుప, జారు. ౪౯

వెన్నలు దినఁ గాంచి వేవే కవాటంబు వాటంబుగాఁ జిల్కు వైచి యోర్తు
పెరుఁగు జుర్రఁగఁ గని బిరబిర బరువెత్తి పరువెత్తి చెప్పఁగాఁ బఱచియోర్తు
మీఁగడఁ జెచ్చెర మెసవు రీతిని జూచి తిని చూచి మరిగినాఁ డనుచునోర్తు
పాలు ద్రావఁగ నోర్వఁ ఛరమై విలోకించి లోకించిదనుకంప లేక యోర్తు
తల్లి కెఱిఁగి ప నిను జోటఁద్రాటఁగట్టి, గట్టిపనిసేయదే చోరకర్మవేళఁ
జారుతర మందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౫౦

## (6) జారత్వదశకము.

విలసిత కుందకుట్మలసుందరరదముల్ రదముల ముద్రిడఁ బెదవి నొక్కి
విస్ఫురత్తరముల వీజితలికుచములఁ గుచముల జంకకుఁ గొనినఁ బట్టి
తొడలపై నిడుకొన్న వడిసాభిమానంబు.....................
యెదుట నిల్చిన మీఁది కెగసి లోనలుగఁగా నలుగఁ గాఢాలింగనం బొనర్చి
బాలుఁడని చేరు చెలులపై భ్రాంతిపడుచుఁ, బడుచుఁదనమున నీరీతిఁ బ్రబలితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ.

గోవులఁ గని భీతిగొనువానిగతి వేగ గతివేగమున వచ్చి కౌఁగిలించి
మేల దాఁచెదు పైఁట నిచ్ఛాసఫలముల ఫలముల నని కుచంబుల గ్రహించి

బింబ మెంగిలి చేయఁ బిన్నవు గావింపు గావింపు మిదియని మోవిగఱచి
నీవీపీడె బిగింప నెత్తు నీమనుమని మనుమని... ... ... ... ...
లేని నెపములనిట్లుగల్పించికొన్నరి,కొన్నరిప్రేతలమానంబుగొంటివౌర,చారు.

తల్లిదండించె నింతకుఁ గన్నులంగుచు రంగుదుకూలాంతరమున రమణి
నిదుర వచ్చెడి శయనింతు నంచలములోఁ జలము లో నెడలింపు చంద్రవదన
పతివచ్చునంతకుఁ బవళించి చనుఁగాఁడ చనుఁబాఁడవారిదే ఘనము కలికి
యీలు సేరలేని పెన్నిరుల నొక్కడ నేఁడు కడనేఁడుగడ నేనె కంబుకంఠి
యనుచు నీరీతి సమయోక్తు లాడు దరసి
యరసి వ్రజమెల్ల జారశేఖరుఁడవగుచుఁ, జారు. ౧౩

పతి యూర లేఁడని పతిసినేఁ గలుగంగఁ గలఁగంగ నేటికే జలజగంధి
దొడ్డికిఁ జనిననాథుఁడు వచ్చునంతకు నంతకు నేఁ జాలనా లతాంగి
యలిగి పోయినమనోహరుని బిల్వఁగనేల వగ నేలలేనె నిన్నిగురుఁబోఁడి
వరుఁడు దూఱుట నన్యతరుణి గామించునే మించునే నీమాటచంచలాక్షి
చనుపబాలుఁడనాసురసప్రబంధ, బంధముల నేరుననిపల్కి ప్రబలితౌర,చా.

లలితరుగ్వ్రజిత పల్లవిత తాపింఛంబుఁ బింఛంబు నొందల బిగియఁ జుట్టి
మృదులనాదసుధాఝురీ నిరర్గళమున గళమున వనమాలికలు ధరించి
రంగుబంగరుసాలు చెంగులు జారఁగా జారగా మైవలెవాటువైచి
జనితామృతాధరం బనుపవడంబున డంబున వేణుకాండంబు నిలిపి
గాన మొనరింప విని తాళమాన మెంచి
యెంచి ప్రేతలు నిన్ను మోహించి రౌర, చారు. ౧౪

గోపికల్ గ్రుంకుచుఁ గొలనిలో నుండఁగా నుండగాఁ జీరల నొడిసికొనుచుఁ
దీరభూజము నెక్కి తెగడుసుందరులను దరులను జేరఁగాఁ దలఁచికొనుచు
నలయించునిన్నుమాయాత్మలాకులముగాఁగులముగాదన దెయిాకొఱఁతనచు
దిరుగ మాకిప్పు డంబరముల నొప్పింపు నొప్పింపవలదు నమ్మెప్పుడనుచు
హస్తములు మోడ్చి మ్రొక్కు రామాభిమాన
మానములుగాచి పటములు మరలనిడవె, చారు. ౧౫

నవరాగమకరంద విపులకుంకాసార కాసారముల జలకంబులాడి
కుంకుమాదిపరాగశంకితచిత్రాంశు చిత్రాంశుకముల నచ్చికధరించి

# కాకినాడ పరిషత్కార్యాలయమున వెలకు దొరకు

# గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | ... 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు ... | ... 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము- శ్రీమాన్ కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | ... 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి ... | ... 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | ... 0 | 3 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుగారు, | ... 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి- విన్నకోట పెద్దయకవి ... | ... 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | ... 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... | ... 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | ... 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | ... 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | ... 0 | 4 | 0 |
| 18 | ప్రాస్వరంగములు-క్రొత్తపల్లి సూర్యరావుగారు ... | ... 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు ... | ... 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ ... | ... 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | ... 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (మొదటిభాగము) అహోబలపతి | ... 1 | 0 | 0 |
| 23 | రెడ్డినాఁటి రెండుశాసనములు ... | ... 0 | 4 | 0 |
| 24 | ఆంధ్రధాతుమాల ... | ... 0 | 12 | 0 |
| 25 | కాళిందీకన్యాపరిణయము (ద్వితీయభాగము) అహోబలపతి. | ... 0 | 8 | 0 |
| 26 | శాసనపద్యమంజరి ... | ... 0 | 12 | 0 |
| 27 | శతకసముచ్చయము (ప్రథమభాగము) ... | ... 0 | 12 | 0 |
| 28 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) ... | ... 0 | 8 | 0 |
| 29 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయసూరి ... | ... 0 | 8 | 0 |
| 30 | రసాభరణము—అనంతకవి. ... | ... 0 | 8 | 0 |
| 31 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) ... | ... 1 | 4 | 0 |
| 32 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) ... | ... 0 | 8 | 0 |

కార్యదర్శులు-ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ.

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.